శ్రీ

# విష్ణుభాగవత సుధాసింధు
## ద్వితీయ తరంగము.



కల్లపాళెపు సూర్యనారాయణ శాస్త్రిచే
వ్రాయబడిన వివరణ
టీకాది సహితము.

శ్రీ

# విష్ణుభాగవతపరతత్త్వార్థబోధక పంచరత్నములు.

---

శ్లో॥ జన్మాద్యస్యయతో౽న్వయాది తరతశ్చార్థే ష్వభిజ్ఞ స్స్వరాట్ తేనేబ్రహ్మహృదాయ ఆదికవ యే ముహ్యన్తి యత్సూరయః॥ తేజోవారి మృ దాం యథావినిమయోయత్రత్రి సర్గో౽మృషా ధామ్నాస్వేన సదానిరస్తకుహకం సత్యం పరం ధీమహి॥ ౧॥ అహమేవాసమేవాగ్రేనాన్యద్య త్సదసత్పరం। పశ్చాదహం యదేతచ్చయో౽ వశిష్యేతసో౽స్మ్యహం॥ ౨॥ ఋతేర్థం యత్ప్ర తీయేత నప్రతీయేతచాత్మని। తద్విద్యాదాత్మనో మాయాం యథాభాసోయథాతమః ॥ 3 ॥

యథామహాంతి భూతానిభూతేషూచ్చావ చేష్వను। ప్రవిష్టాన్యప్రవిష్టాని తథాతేషునతే

ష్వహం॥ ౪। ఏతావ దేవజిజ్ఞాస్యంత త్త్వ జిజ్ఞాసునాత్మనః। అన్వయ వ్యతిరేకాభ్యాం యత్స్యా త్సర్వత్ర సర్వదా॥ ౫॥

వివరణము.

రెండు మొదలు అయిదువరకు గల నాలుగు శ్లోకములు భాగవతముయొక్క పరత త్త్వసారము ను శ్రీనారాయణమూ ర్తి బ్రహ్మకుపదేశించినవి. మొదటి ‘‘జన్మాద్యస్య’’యను మంగళ శ్లోకము కూడాయీయర్థమునే కలిగియున్నది. ఎట్లనిన:--

సృష్టికి ముందును, సృష్టికాలమందును, నేనే యున్నాను. మఱియొక టేదియు లేదు. అని రెండవ శ్లోకార్థము. ఈ తాత్పర్యమునే మంగళ శ్లోకమందలి ‘‘జన్మాద్యస్యయతః’’ అను పదము లు చెప్పుచున్నవి.

లేని వస్తువు కలిగినటుల, ఉన్నది లేనటుల, కనుపింప జేయునది నాయొక్క మాయ. అను నది మూడవ శ్లోకార్థము. ఈ తాత్పర్యమునే ప్రథమ శ్లోకమందలి ‘‘తేజోవారి మృదాం యథావినిమయః’’ అను పదములు చెప్పుచున్నవి.

మహాభూతములై మను, సృష్ట్యనంతరము స్థూలసూక్ష్మో పాధులయందు కనుబడుటచే వాటిలో ప్రవేశించినవిగాను, పూర్వమే కారణరూపమై వాటియందుండుటవలన క్రొత్తగా బ్రవేశించక పోయినవిగాను, యెట్లుల తలంచు చున్నానో, అటులనే నేనున్న యీసర్వ ప్రపంచమునందు కారణరూపమై ముందుగానే యున్నందుచే, క్రొత్తగా ప్రవేశించ లేదనిన్ని, అధిష్ఠాన సత్తాచే ముందుగానే ప్రవేశించి యున్నానని న్ని తెలియవలెను. వాటివల్ల నాస్వచ్ఛ స్వరూపమునకు బాధలేదు. అనునది నాలుగవ శ్లోకార్థము. ఈ తాత్పర్యమునే ప్రథమ శ్లోకమందలి "యస్మిత్రిస్తోమ్యపా", "ధామ్నాస్వేన సదానిరస్త కుహకం" అను పదములు చెప్పుచున్నవి.

పరతత్త్వముయొక్క యాథార్థ్యము తెలిసికొన నిచ్ఛగలవారు యింతమాత్రమే, అన్వయ వ్యతిరేకముల చేతను, విచారించవలెను. అనునది అయిదవ శ్లోకార్థము. ఈ తాత్పర్యమునే

ప్రథమశ్లోకమందలి "అన్వయవ్యతిరేకాభ్యాం" అను పదములు చెప్పుచున్నవి. అన్వయమనగా జాగ్రత్స్వప్న సుషుప్తులను వాటికి సాక్షిసగుటచే అనుసరించిన వానిగాను, సమాధి మొదలయిన వాటియందు చిన్మాత్రమే శేషించియున్నందున వ్యతిరేకముగా నున్నవానిగాను అనియర్థము.

ఈ ప్రథమశ్లోకము గాయత్ర్యర్థమును బోధించుచున్నందున, పరతత్త్వార్థ బోధకమని వేరే చెప్పనవసరములేదు.

ఎట్లనిన:—

| | | | |
|---|---|---|---|
| తత్ —అనుదానికి బదులు | | సత్యం—అనియు. | |
| సవితృ | ,, | యతిః | ,, |
| వరేణ్యం | ,, | పరమ్ | ,, |
| భర్గః | ,, | స్వరాట్ | ,, |
| దేవస్య | ,, | అస్య | ,, |
| ధీమహి | ,, | ధీమహి | ,, |
| ధియః | ,, | హృదా | ,, |
| యః | ,, | యః | ,, |
| నః | ,, | ఆదికవయే | ,, |
| ప్రచోదయాత్ | ,, | తేనే | ,, |

మఱియును యీప్రథమశ్లోకము ఉత్తరమీమాంసయను వేదాంత శాస్త్రముయొక్క సమస్త సారభూతమగు మొదటి నాలుగు అధికరణముల, లేక, సూత్రముల యర్థమును చెప్పుటయేగాక, ఆశాస్త్రముయొక్క ఉత్తర గ్రంథమునకు ఆదియగు సాంఖ్యమత నిరాకరణ రూపమైన యైదవ అధికరణార్థమును కూడ చెప్పుచున్నది.

ఎట్లనిన:—

ధీమహి — జిజ్ఞాసాధికరణబోధకము.

జన్మాద్యస్యయతః — లక్షణాధికరణము.

తేనేబ్రహ్మహృదా — శాస్త్రయోనిత్వాధికరణము.

ముహ్యంతి యత్సూరయః — సమన్వయాధికరణము.

అర్థేష్వభిజ్ఞః — ఈక్షత్యధికరణము.

ఇందువల్ల నిది సర్వోపనిషత్సార మనుటకు సందియము లేదు.

ఈ పంచరత్నములకు పోతనామాత్యకవిచేసి న పద్య గద్య రచనయేమనగః—

మొదటిశ్లోకార్థము.

సీ॥ విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వనివలన నేర్పడుచునను వర్తనమున। వ్యావర్తనమున, గార్య ములం దభిజ్ఞుడై తానరాజగుచు జిత్తమున జేసి। వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వడు బు ధులు మోహింతు రెవ్వ। నికి నెండమావులనీళ్ల గాచాదులనన్యోన్యబుద్ధి దానడరునట్లు।

గీ॥ త్రిగుణసృష్టియెందు ౼దీపించి సత్యము। భంగిదోచు స్వప్రభానిరస్త। కుహకుడెవ్వడతని గోరి చింతించెద।ననఘుసత్యుబరుని ననుదినంబు॥

రెండవశ్లోకార్థము.

సీ॥ + + +

సృష్టి పూర్వమున జర్చింప నేనొకరుండ గలిగియుండుదు వీతకర్మశగుచు। సమధికస్థూల సూక్ష్మస్వరూపములు దాక్కారణ ప్రకృతియుదగ్ర మదంశ॥ గీ॥ మందు లీనమైన నద్వితీయుండనై।

యుందు నాకు సన్యమొకటి లేదు । సృష్టికాల
మందు సృజ్యమానంబగు । జగము మత్స్వరూప
మగునువత్స ॥

క॥ అరయగ గల్పప్రళయాంతరముననాద్యంత
విరహిత క్రియత్వోడం । బరిపూర్ణ నిత్యమహి
మం। బరమాత్ముడనై సరోజ భవయోనుందుగా॥

## మూడవ శ్లోకార్థము.

లేని యర్థంబు శుక్తిరజత భ్రాంతియుం బోలె
నేమిటి మహిమనుండోచి క్రిమ్మర దోపక మాయన
దియె మదీయ మాయావిశేషంబని యెఱుంగు
ము. అదియునుం గాక లేని యర్థంబు దృశ్య
మానంబగుటకును, గలయర్థంబు దర్శనగోచరం
బు గాకుండుటకును, ద్విచంద్రాదికంబును దమః
ప్రభాసంబును దృష్టాంతంబులుగా దెలియుము.

## నాల్గవ శ్లోకార్థము.

ఏప్రకారంబున మహాభూతంబులు, భౌతికం
బులైన ఘట పటాదులందు బ్రవేశించియుండు
నా ప్రకారంబున నేను యీ భూతభౌతికంబు

అయిన సర్వకార్యంబులందు సత్త్వాదిరూపంబులం బ్రవేశించి యుండుదు. ఘాతితంబులు ఘూతంబులందు గారణావస్థంబొందు చందంబున ఘూతఘాతితంబులు, గారణావస్థంబొంది నాయందు అభివ్యక్తంబులై యుండవు.

అయిదవ శ్లోకార్థము.

సర్వదేశంబుల యందును సర్వకాలంబుల యందును యేది బోధితంబై యుండు అట్టిది యు పర బ్రహ్మ స్వరూపంబు. తత్త్వంబెఱుంగ యిచ్ఛయించిన మిమబోటి వారలకు యీచెప్పిన మదీయ తత్త్వాత్మకంబైన అర్థంబు అర్థంబని యెఱుంగుము. ఈ యర్థంబుత్కృష్టంబగుటయని యేకాగ్రచిత్తుండవై యాకర్ణించి భవదీయ చిత్తంబున ధరియించిననీకు సర్గాది కర్మంబులందు మోహంబు జెందకుండెడినని భగవంతుండైన పరమేశ్వరుండు చతుర్ముఖున కానతిచ్చె.

---

పంచరత్నముల టీక.

౧ శ్లోకము—అర్థేషు=ఆకాశాది పదార్థములయందు।అన్వయాత్=మృత్సువర్ణాదులవలె,

కారణమై యున్నదనను। ఇతరతశ్చ=ఘటకుం డలాదులవలె కార్యమై యున్నదనను। అస్య=కనుపడు యీ ప్రపంచముయొక్క। జన్మాది=పుట్టుట, పెరుగుట, గిట్టుట। యతః=ఏపరమేశ్వరునుండి కలుగుచున్నవో। అభిజ్ఞః=ఎవ్వడు సర్వజ్ఞుడో। స్వరాట్=తనునుండి తానేకలుగునో। యట్=ఏవేదములో। సూరయః=బుధులు। మోహంతి=మోహింపబడుచున్నారో। బ్రహ్మ=శబ్దబ్రహ్మమగు అట్టివేదమును। ఆదికవయే=చతుర్ముఖ బ్రహ్మకు। హృదా=మనస్సుచేత। యః=ఎవడు। తేనే=ప్రకాశింపజేసెనో। యత్ర=ఏపరమేశ్వరునందు। త్రి=ఆత్మ మాయాగుణములగు తమోరజస్సత్త్వములయొక్క। సర్గః=భూత, ఇంద్రియ, దేవతా, రూపములగు సృష్టియు। తేజో, వారి, మృదాం, యధావినిమయః ఎండమావులయందు నీరుఅని; ఉదకముల యందు గాజుఅని; గాజుయందు నీరుఅని; ఆభాసజ్ఞానము కలుగునటుల। అమృషా=వాస్తవముగ దోచునో, లేక అట్టిసృష్టి। మృషా=అబద్ధమో।

స్వేనధామ్నా=తన తేజస్సుచేత । సదా=సర్వకాలమందు । నిరస్త= పోగొట్టబడిన । కుహాకం= మాయాప్రపంచముగల । సత్యం= నాశరహితుడగు । పరం=పరమేశ్వరుని । ధీమహి= ధ్యానించుచున్నాము । శిష్యులతోకూడానని బహువచనము.

2 శ్లోకము—అగ్రే= సృష్టికి పూర్వము । సదసత్పరమ్=సత్తు, అసత్తులకు మీరిన పరబ్రహ్మవస్తువును । అహమేవ—నేనుగానే ॥ ఆసమ్— ఉన్నాను । నఅన్యత్— ఇతరమేమియు లేదు । పశ్చాత్—సృష్టికాలమందు । యత్ ఏతచ్చ కనుపడుచుండే యీజగత్తున్న । అహం— నేనుగానే ఉన్నాను । యః అవశిష్యేత — ఏదిప్రళయమైన తరువాతనున్న నిలిచియుండునో । సః అస్మి అహం— అదినేనుగానే యున్నాను.

3 శ్లోకము—ఋతేర్థం యత్ ప్రతీయేత— లేనివస్తువు ప్రకాశమాన మగుట । నప్రతీయేత, చ, ఆత్మని—సత్యమైన ఆత్మవస్తువు ప్రకాశించ

ఉండుట । యథాఽఽకాశస్థితః, యథాకాశః— శుక్తిరజతజ్ఞానాదికములు; గ్రహములలో సంచారము గల రాహువునకు ప్రతీతి లేకుండడము; ఇవెను దేనివలన కలుగుచున్నదో । తత్. విద్యాత్, ఆత్మనః, మాయాం—దానిని నామాయగా తెలిసికొనుము.

౮ శ్లోకము— యథా— ఏరీతిగ । మహాంతి భూతాని— పంచ మహాభూతములు । భూతేషు, ఉచ్చావచేషు— స్థూలసూక్ష్మాదులయందు। అను ప్రవిష్టాని—స్వవ్యనంతరము దు కనుపడుటచే ప్రవేశించినవిగాను । అప్రవిష్టాః—పూర్వమే కారణ రూపమై వాటియందుండుటచే, ప్రవేశించక పోయినవిగాను, చెప్పబడుచున్నవో । తథా తేషు, ప, తేషు. అహం—అటులనే సకల ప్రపంచమునందు, అధిష్ఠాన సత్తాచే ప్రవేశించినవాడను గానున్ను, కారణరూపమై ముందుగానే యుండుటచే క్రొత్తగా ప్రవేశించకపోయిన వాడనుగానున్ను ఉన్నాను.

౫ శ్లోకము— ఆత్మనః— పర్యాంతరాత్మనః యొక్క। తత్త్వజిజ్ఞాసుః— తా స్తవస్థితిని తెలిసికొను యిచ్ఛగలవానిచే। ఏతావత్ యేవ— ఇంత వరకే। అనగా। యత్—ఏది। అన్వయ వ్యతిరేకాభ్యాంస్యాత్—జాగ్రత్స్వప్న సుషుప్తులయందు సాక్షియగుటచే, అనుసరించి యున్నాడని; సమాధి మొదలయిన వాటియందు చిన్మాత్రమె శేషించి యున్నందున, వ్యతిరేకముగా నున్నాడని। సర్వత్ర సర్వదా—అన్నిచోట్ల యెల్లప్పుడు। జిజ్ఞాస్యం— విచారించదగి యున్నది.

ఓం తత్సత్.



